సంపుటము 3] మార్చి 1917 [సంచిక 9

# బాలమిత్ర





## కల్లు అను త్రాచుపాము

ప్రియ పిల్లలారా!

పాములవాడెప్పుడైనను పాముల నాడించుట చూచితిరా? నేను మీ కిప్పుడొక పామునుగూర్చి కథను చెప్పెదను. వినండి.

ఒకనాడొక చెంచువాడు అరణ్యముగుండా బోవుచుండగా త్రోవలో తనముందర ఒక త్రాచుపిల్లను జూచెను. దాని నింటికి దీసికొనిపోయి బహు జాగ్రత్తగా పెంచెను. ప్రతి దినము సాయంకాలమైనప్పుడు తన యింటిముందర కూర్చుండి దానితో నాడుకొనుచుండువాడు. అది వానికిని వాని కుటుంబమునకు ముద్దుబిడ్డగా నుండెను. దాని కత డెన్నో పనులు నేర్పెను. సలాము చేయుటెట్లో నేర్పెను. చేతికి మురుగు వలెను, మెడకు హారమువలెను, తలకు పాగావలె చుట్టుకొనునట్లు నేర్పించెను. కొంత కాలమున కది ఆప్రాంతములన్నిటిలో నున్నవాటికంటె గొప్ప పామాయెను. ఎప్పటివలెనే ఆ చెంచువాడు ప్రతి సాయంత్రము దానిచేత తమాషాపనులు చేయించు చుండువాడు. దానిని చూచుటకు గ్రామములోని వారందరు తీరుబడి చేసికొని వచ్చెడివారు.

ఒకనాడతడు మామూలు ప్రకారముగా యింటిముందు పనులు చేయించుచుండెను. దానినిచూచుటకు జనులువచ్చిచుట్టు మూగిరి. బహు ఆశ్చర్యముతో దానిచూచుచుండిరి. ఆపెద్దపాము వానితలకు పాగావలె చుట్టుకొనెను. తరువాత వాడు "దిగు" మని చెప్పెనుగాని అకస్మాత్తుగా దానికి కోపమువచ్చి చటుక్కున వానిచెంపపై కరచెను. క్షణములో వాడు క్రిందపడి చచ్చిపోయెను. ఆ గ్రామస్థులు వెంటనే దానిని కొట్టిచంపిరి.

ప్రియ పిల్లలారా! వాడు మొదట తెచ్చుకొన్న ఆ చక్కని పాముపిల్ల తన నెప్పుడైనను చంపునని వాడనుకొనెనా? లేదు గదా! దీనివలన మన మొక మంచి నీతిని నేర్చుకొనగలము. కల్లు కొట్టులోకి పోవువాడెన్నడైనను తాను త్రాగుచున్న కల్లు తనను చంపునని యనుకొనుచున్నాడా? లేదుగదా? అయినను కల్లు వానిని చంపును. అది త్రాచుపిల్లవంటిది. మొదట చిన్నదిగానే యున్నది. హానికరము గానట్లుండును. మొదట కొంచెము, తరువాత మరికొంచెము ఇట్లు క్రమ క్రమముగా అది చెడ్డ అలవాటై చెంచువాని పామువలె చంపివేయును. పిల్లలారా! ఎన్నటికిని కల్లును ముట్టకుడు, రుచి చూడకుడు, త్రాగకుడు, మీరు దాని త్రాగినయెడల మిమ్ము చంపును. చెంచువాని పామును జ్ఞప్తి తెచ్చుకొనుడు.

---

# హాలండు దేశము

ప్రియపిల్లలారా!

ఇదివరకు మీరు రుష్యా, చీనాలలోని చిత్రమైన అలవాటులనుగూర్చి నేర్చుకొనియుంటిరి. ఈనెలలో హాలండు దేశమునుగూర్చి నేర్చుకొందము. ఇది జర్మనీ దేశమునకును, బెల్జియమునకును మధ్యనున్నది. ఒక వైపున సముద్రముచేత

నావరింపబడినది. అనేకవందల సంవత్సరములనుండి ఆ దేశపు వారు తమ దేశము సముద్రపు జలముతో మునుగకుండునట్లు



పోరాడుచున్నారు. ఇచ్చట రోడ్లకంటె కాలువలే ఎక్కువగా నుండును. బండ్లమీదగాక ఎక్కువగా పడవలలో ప్రయా

ణము చేయుచుందురు. హాలండు దేశమున మంచిపశువులు



గలవు. గాన అచ్చట మంచి జున్నును చేతురు, పాలును అమ్ముదురు. అక్కడ మంచి పుష్పగడ్డలను పండించి అమ్మెదరు. అక్కడనుండు బాలురును బాలికలును తమ తలిదండ్రులవలెనే బట్ట ధరింతురు. వదులు షరాయిలను, బిగుతుకోట్లను, లటుక్కు, లటుక్కుమను చెక్కచెప్పులను ధరింతురు. ఆ దేశపువారు బహు కష్టజీవులు. మంచివారు. ఆతిథ్యపరులు,

ఈ యుద్ధమున వారు బెల్జియము దేశములో దిక్కులేక దీన దరిద్రులైనవారికి చాలదయ జూపుచున్నారు. బెల్జియము దేశమువారిలో చాలమంది ఆశ్రయముకై ఆదేశము జేరిరి. హాలండు దేశపు పిల్లలవలె మనమును కష్టజీవులమై, మంచి వారముగానుండ ప్రయత్నింతము.

# పురాతనమగు గ్రీకుదేశ రాతిప్రతిమ

చాలకాలము క్రిందట, గ్రీకుపట్టణములలో నొక పట్టణమందు, దారిప్రక్కను మిగుల చిత్రమగు నొక రాతిప్రతిమ యుండునది. దానిమీద వ్రాయబడిన మాటలు జాగ్రత్తగా మననేర్పుకై దాచిపెట్టబడినవి. ఆ మాట లీదిగువ వ్రాయబడినటుల సంభాషణ రీతిగా నున్నవి.

"ఓ ప్రతిమా! నీ పేరేమి?"

"అవకాశము"

"నిన్నెవరు చేసిరి?"

"విసిపస్"

"ఎందులకు బొటనవ్రేళ్లపై నిలుచున్నావు?"

"ఒక్క నిమిషముకుమించి నిలువజాలనని చూపుటకు"

"నీ పాదములపై రెక్క లెందుకున్నవి?"

"నే నెంతవడిగ పోదునోయని కనుపర్చుటకు"

"నీ నొసటమీద పడునంత పెద్దవెండ్రుకలు నీ కెందుకు?"

"నన్నెదుర్కొను మనుజులు నన్ను పట్టుకొనుటకు."

"అంతా సరేగాని నీతలవెనుక బట్టతలగానున్న దెందులకు?"

"ఎందులకా? ఒక్కసారి నన్ను పట్టుకొనుట తప్పినా మరెప్పటికి నన్ను పట్టజాలరని కనుపరచుటకు."

రక్షింపబడని ఓ చదువరీ! నీవిషయమున నీపై సంభాషణమెట్లు సరిపడుచున్నది? "ఇదిగో ఇదే తగినసమయము, ఇదే రక్షణ్యాదినము" అనునది నీ యాత్మరక్షణకు తగిన హెచ్చరికగా యున్నది. ఆలస్యముచేయక రక్షింపబడితివా యని ప్రశ్నించుకొమ్ము. రేపనుదినము రాకుండవచ్చును. పాపక్షమ చచ్చినతర్వాత రాదు. కృపాదినము బహు సంకుచితమై యున్నది. కాన త్వరపడి నీకున్న అవకాశముల పోగొట్టుకొనక జాగ్రత్తపడి, నీ స్వరక్షణ కొనసాగించుకొనుము.

---

## హతసాక్షులు

ఈ పతమేమిటో తెలియునా? చాల సంవత్సరముల క్రిందట నీరో అను కౄరుడగు రాజొకడు గలడు. అతడు రోము అను గొప్ప పట్టణములో నివసించెను. క్రైస్తవులంటే వానికి బహుద్వేషము. అతడు అప్పుడప్పుడు తన స్నేహితుల నందరిని గొప్ప నాటకశాలకు రమ్మని పిలుచువాడు. ఈ నాటకశాలకు మధ్యగా నొక పెద్ద ఇనుపబోను

గలదు. అతడు క్రైస్తవులనుపట్టి తెప్పించి ఈ బోనులో వేయువాడు. తరువాత సింహములు, పెద్దపులులు మొదలగు



భయంకర మృగములను తెప్పించి వాటి నా బోనులోకి వదలి పెట్టించువాడు. తరువాత జరుగునదేమి? అవి ఆ క్రైస్తవులను పట్టి ముక్కలు ముక్కలుగా చీల్చి చంపునవి ఈలాగున నీరో తన స్నేహితులను సంతోషపరచెడివాడు. ఎంత క్రూరుడు! అప్పుడా క్రైస్తవులుజూపిన ధైర్యశాంతము లెంత గొప్పవి? వారు తమ ప్రియ ప్రభువగు యేసుక్రీస్తును మిక్కిలి ప్రేమించిరి గనుక ఇట్టి క్రూరమరణమును లెక్కచేయలేదు.

వారాయనను దూషించి "ఏసుక్రీస్తును నేను ప్రేమించుట లేదు. ఆయన నికను సేవింపను" అని చెప్పినయెడల నీరో వారిని వదలి పెట్టువాడేగాని వారాలాగున చెప్పలేదు. వారు తమ ప్రభువుకొరకును, తమ నమ్మకము కొరకును ప్రాణములను పెట్టిరి.

ఒక క్రైస్తవ కుటుంబములో ఏసును ఎక్కువగా ప్రేమించిన డీమస్ అను చిన్నపిల్లవాడొకడుండెను. నీరో ఆ కుటుంబికులను పట్టి తెప్పించి వాని తల్లి దండ్రులను అగస్టసను వాని అన్నను చంపించెను. పాపము చిన్ని డీమసు బహుగా నేడ్చెను. అతని స్నేహితు లతని నోదార్చ యత్నించిరి. గాని అతడు "నా ప్రభువుకొరకు చనిపోవుటకు నేను భయపడుదునని రాజనుకొనుచున్నాడా? నాకంటె అగస్టసు ఏసు నెక్కువ ప్రేమించుచున్నాడని తలంచెను కాబోలు. అయ్యో! నన్నెందుకు చంపరు? నా ప్రభువుకొరకు నేనెందుకు చావగూడదు. నేనును ఆయనను ప్రేమించుచున్నా" నని యేడ్చెను.

ప్రియపిల్లలారా! డీమసు యేసును ప్రేమించినట్లు నీవు ప్రేమించుచున్నావా? ఆయనకొరకు చనిపోవుటకు నీకిష్టమా? అట్లయితే ప్రతిదినము ఆయనకొరకు బ్రతుకుము. ఆయన యొక్క ధైర్యముగల యుద్ధభటునివలె నుండుము. నీప్రియ

యేసుక్రీస్తుమైన మాటలు మాత్రము మాట్లాడుము. పవిత్రు డవుగా నుండుము. మాటయందు క్రియయందును పరిశుద్ధు డవుగా నుండుము. శోధనలలో ధైర్యముగా నుండుము.

---

# ప్రకృతి పాఠములు

## 31 వ పాఠము



చెవి

(సశేషము)

గతమాసములో కంటినిగూర్చి నేర్చుకొనియుంటిమి. మన కున్న ఇంద్రియము లన్నిటిలో దీనికంటె అద్భుత మైనది మరియొకటిలేదు. అట్టికండ్లను మనమెంతో జాగ్రత్తగా నుంచుకొనవలెను. ఈ పాఠములో మరియొక ముఖ్యమైన ఇంద్రియమునుగూర్చి చెప్పెదను. అది చెవియై యున్నది.

మనస్సు సంగతులను తెలిసికొనుట కిదియొక ముఖ్య ద్వారమై యున్నది. లోకములో ప్రతివాడు ఎక్కువసంగతులను కంటిద్వారాను చెవిద్వారాను తెలిసికొనుచున్నాడు. మనము మాచినసంగతి మనస్సులో బాగుగా నాటును. అదేలాగున వినిన ధ్వనియును మనస్సునందు నిలుచును. చెవిద్వారా ధ్వనులు లోనికిబోవును. ధ్వని ఆయా వస్తువుల లోని చిన్నచిన్న భాగములు కదలుటవలన, నేర్పడును. అందువలన నీటిలో రాతిని రువ్వినయెడల ఎట్లు తరంగములు బయలుదేరి ఒడ్డువరకు వ్యాపించునో అదేలాగున ఏదైన వస్తువు ధ్వనించినప్పుడు గాలిలో తరంగములుపుట్టి అన్ని దిక్కులకు వ్యాపించును. ఈలాగు వ్యాపించిన గాలితరంగములు చెవిని సమీపించి, చెవియందున్న రంధ్రముగుండా బోయి లోపలనున్న ఒక సన్ననిపొరకు తగులును. దీనినే గూబ అందుము. మనము చెవియని చెప్పునది చెవిలో ఒకభాగమేగాని చెవి అంతా కాదు. మనకు కనుపడు చెవి ధ్వనిని గొనితెచ్చు వాయుతరంగములను లోనికి పంపునట్టి సాధనమై యున్నది. దానిలోనుంటూ మిట్టపల్లములన్నియు ధ్వనిలోకి పోవునట్లుచేయుట కేర్పాటు చేయబడినవి. ధ్వని లోనికి బోవుటకు షుమారు $1\frac{1}{4}$ అంగుళీముల పొడవుగల గొట్టమున్నది. ఇది మధ్యచెవిలోనికి దీసికొనిపోవును. అచ్చట

ఇదివరకుచెప్పిన గూబగలదు. ఈ గూబ కదలును. ఈ గూబను ఆనుకొని చిత్రమైన ఎముకలు మూడుగలవు. ఒకటి సుత్తెవలెను, ఒకటి దాగలివలెను, మూడవది రికాబువలె నుండును. ఇవి ధ్వనిని లోపలిచెవికి దీసికొనిపోవును ఇచ్చట ఒకనాడి యుండి ధ్వనిని మెదడుకు దీసికొనిపోవును. ఈ నాడికి 6000 శాఖలు గలవని చెప్పుదురు.

బాగుగా తెరువబడియుండు ఇంద్రియములలో చెవి యొక ఇంద్రియము. దీనిలోనికి పురుగులు మొదలగునవి బోయి చెవికి తొందరకలిగించవచ్చు పనిగాని లోపల దేవుడేర్ప రచిన ఏర్పాటును జూచినయెడల బహు వింతకలుగును. లోనికిబోవు ఈ గొట్టము తిన్నగాలేదు. వంకరటింకరగా నున్నది. మరియు ఈ గొట్టములో గులిబియను బంకబంకగా నుండు ఒకతరహా చేదుపదార్థమున్నది. లోనికిబోవు ఎట్టి యితరపదార్థమునైనను ఇది బోకుండ అడ్డగించును. గాన అట్టివానివలన తొందర అంతగా జరుగదు. ఇట్టి చెవిని మనము జాగ్రత్తగా కాపాడుకొనవలెను. పుల్లలు మొదలగు నవి పెట్టి గోకుకొనుట తప్పు, చేయుగూడని పని.



# బైబిలు పిల్లలు

## నాదాబు; అబీహులు

అహరోను కుమారులైన నాదాబు, అబీహులను గురించి ఈ మాసమున నేర్చుకొందము. లేవికాండము 10 వ అధ్యాయము చదివిన వీరి సంగతి కొంత తెలిసికొన వచ్చును. వీరు ఐగుప్తునందే పుట్టిరి. ఇశ్రాయేలీయుల నచ్చటనుండి విడిపించి అరణ్యముగుండా తీసికొని మోషే అహరోనులు వచ్చుచున్నప్పుడు పడుచువారైయుండి ప్రభువు వారి కాసమయమున అనుగ్రహించిన మన్నాయను ఆహారము, బండనుండి నీళ్లువచ్చుట మొదలగువానిని ఇతర కష్టములందు వారెట్లు తప్పించబడినది కండ్లార చూచినవారు. అరణ్యమందు వారు తప్పులుజేసినప్పు డెట్లు ప్రభుచే శిక్షించ బడినదికూడా చూచియుండిరి. అయితే ఎంత గొప్పగొప్ప హెచ్చరికలు నొందినను వారిజీవితములలో ప్రభువు ఆజ్ఞాపించినట్లుచేయక మరణమొందిరి. బహుశః చదువరులలో చాలమందికి వీరిచరిత్ర తెలియకుండును. వీ రిరువురు ప్రభువు యొక్క పనివారుగా అనగా బలులు నర్పించు యాజకులుగా నియమించబడినవారు. యెహోవా వారికి బలుల నీప్రకా

రము అర్పించవలెనని స్పష్టముగా నాజ్ఞాపించెను. అయితే వీరు ధూపార్తుల నర్పించునప్పుడు ప్రభువు ఆజ్ఞాపించనిరీతిగా చేసిరి. బలిపీఠమందలి నిప్పుచేతనే బలిని అర్పించుమని వారికి యాజ్ఞాపించబడెను. అయితే వారు ఇతరనిప్పుతెచ్చి దాని మీద ధూపద్రవ్యములు వేయగా ప్రభువుసన్నిధినుండి అగ్ని బయలుదేరి ఆజ్ఞమీరి తప్పుచేయుచున్నవారిని క్షణములో కాల్చెను. వారిశవము బయటికి తీసి వేయబడెను.

బాలమిత్రులారా! వీరి బ్రతుకులవలన ఏమి నేర్చుకొను చున్నారు. నాదాబు, అబీహులవలె చిన్నతనమునుండి దేవుని సంగతుల తెలిసికొని మంచి భయభక్తులు గలవారముగా పెంచబడవచ్చును. ప్రభువు ఆజ్ఞాపించిన చిన్నయాజ్ఞను మీరి నను మనపై శాపము నిలుచును. నిజముగా మనము ప్రభువుని ప్రేమించుచు ఆయన ఆజ్ఞల గైకొందము.

---

# గులాబి పువ్వు

ఎంత చక్కని-దెంత చక్కని-దెంత చక్కని-దీ గులాబీ।
పచ్చనాకుల నడుమ నెంతో-హెచ్చుగా నిది యొలుపుజూపును ॥ఎంత॥

1. ఇందులో మక-రందమున్నది-డెందముల నానందమట్టుల।
కందులేవి? మరి వందరూకల-కిందులోగల చంద మెంతయు ॥ ఎంత ॥

2. రమ్ము రమ్మని కమ్మతావులు-ఘుమ్ము ఘుమ్మని-చిమ్ముచున్నవి।
జుమ్ముజుమ్మని తుమ్మెదలు గా-నమ్ము చేయుచు -గ్రమ్ముచున్నవి ॥ ఎంత ॥

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ప్రియమైన బాలమిత్రను చదువు బాలబాలికలారా! బాల మిత్రయను యీ చిన్నపుస్తకమందు నాకుగల ప్రేమ చేత మిగుల సంతసముతో కొన్ని సంగతులను మీకు వ్రాయు చున్నాను. నేను సత్తెనపల్లియందు హైయర్ ఎలిమెంటరి స్కూల్‌లో మూడవతరగతి చదువుచున్నాను. మా బడి పై అధికారులు, రెవ. ఐ. కెన్నడి దొరగారు, మా పంతులుగారి పేరు, జి. మాణిక్యముగారు, మా బడిలో అన్నివర్ణముల విద్యా ర్థులు గలరు. మేము అందరము సోదరభావముతో కలసి మెలసి ఉంటున్నాము. మాబడి మూడుసంవత్సరముల క్రిందట స్థాపింపబడినది. మొదట సంఖ్య బహు కొద్దిగా నున్నను దేవుని కృపవల్ల క్రమక్రమముగా వృద్ధిపొందుచున్నది. నేను ఇంగ్లీషును తెనుగును చక్కగా చదువుకొనుచున్నాను. మా బడిలో క్రైస్తవ మతసంగతులు చక్కగా నేర్పబడుచున్నవి. మేము మంచి కీర్తనలు పాడుటకు నేర్పబడుచున్నాము. మా యింటిలో నాతల్లిదండ్రులతోను తాత, జేజిగార్లతోను కలసి ప్రతిసాయంత్రము కీర్తనపాడి బైబిలుచదివి రోజు ఒకరము వరుసగా ప్రార్థించుతాము. కుటుంబప్రార్థనలో నావంతు

వచ్చినప్పుడు నా చేతనైనంతవరకు ప్రార్థనచేయుచున్నాను. నా తల్లిదండ్రిని కాయలాలనుండి దేవుడు కాపాడినందుకు వందనములు చెల్లించుచుందును. ప్రతి ఆదివారము గుడికివెళ్లి ప్రసంగములు విని సబ్బాతుబడి పాఠములు నేర్చుకొంటున్నాను. నాకు యెల్లప్పుడు యిట్టి నేర్పు దొరికేలాగున మా బడినిన్ని మాపంతులగారినిన్ని మాపై అధికారులనున్ను మా తల్లిదండ్రులనున్ను దేవుడు దీవించి కాపాడుటకు యీ పత్రికను చదువు మీరందరు ప్రార్థించవలెనని మిక్కిలి వినయముగా బ్రతిమాలుకొనుచున్నాను.

మీకు నా ప్రేమ సలాములు

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు,

బండారు జార్జి,

సత్తెనపల్లి.

నీతిమంతుని నోరు జీవపుఊట.
భక్తిహీనుల నోరు బలాత్కారము మరుగు పరచును.
పగ కలహమును రేపును.
ప్రేమ దోషములన్నిటికిని కప్పును.

సామెతలు 10: 11, 12.

C. L. S. PRESS, MADRAS—1917